(4) చౌపదము.

కలసి చతుర్లఘుగణములయందు
నలిఁ ద్రిగణంబై నగణము వొందు
నలరు గణద్వయయతి గోవిందుఁ
బలుకఁ గృతులఁ జౌపద చెలువందు.

ఇందుఁ జతుర్లఘుగణత్రయముపై నగణము వ్రాయవలె నఁట, లక్షణమునఁ జెప్పకున్నను నంత్యప్రాస మున్నది. భీమనపెద్దనలు చతుర్లఘుగణములు (భ- స- గా- నల) నాలు గుండవలె నని యంత్యానుప్రాసంబును విధించిరి. అప్పకవి భీమనపెద్దనలమత మనుసరించి గణములం బేర్కొని యంత్యానుప్రాసమును మాత్రము పరిత్యజించెను. అనంతు నిది వీనికి భిన్నముగా నున్నది. (చతుర్లఘుగణములందుఁ ద్రిగణంబు + ఐ, నగణము వొందు నని పైపద్యమున కర్థము చెప్పవలె; నవి ద్రిగణముపై నగణము వొందు ననినచో సుగమముగా నుండు నని నాయాశయము) మఱి యిందు నగణ మని లక్షణమునఁ గలదు. లక్ష్యమున హాగణ మున్నది. సూర్యగణ మున్నచో నిర్బాధకం బగును.

(5) విశాళచౌపద.

అర్కనామగణ మనువుగ రెండు, దార్కొని లఘువొందఁగ నిట్లుండు
దర్కింపఁగను విశాళమునందుఁ, బేర్కొనఁ దగు హాబిరుదులపిండు.

ఇందుల కర్థము విచార్యము; ఇట్టిది యప్పకవీయమున నొండున్నది, దానియర్థమును విచార్యమే.

భానుయుగముపై బయినవలనిం,పూన మణివిరతి నొంది ధరలో
జానలరుఁ జతుష్పదవి శాలా,ఖ్యానము నవి నాయకతురంగా.

అనంతునిలక్షణ మున్న తెఱఁగరయుఁగాఁ బంచదశలఘువులు గల గణము లొకపాదమునఁ గలది యని తెలియవచ్చెడి. యతి తొమ్మిది లఘువులపై నున్నది. అనంతునిపద్యమున నంత్యానుప్రాసము గలదు గాని మూఁడవపాదమున తకారమునకు మాఱు దకార మున్నది. దీనిచే దడ

లకుఁ బ్రాసమైత్రియుఁ గల దని తేలెడిని. దడలకు యతిప్రాసమైత్రి గల దని కొందఱు లాక్షణికులమతముగాఁ గోచరించెడిఁగాని యప్పకవి వాని నగ్రాహ్యప్రశస్తముల పట్టికకుఁ జేర్చినాఁడు. జ్ఞాకు నకారము తద్భవవ్యాజమునను, నభేదవ్యాజమున వబ, లళ, మున్నగువానికి యతి చెల్లునప్పుడు (?) డిండీరడంభడాడిమీ డోలికాది శబ్దంబులకు సంస్కృతమాదును, దాక దగ్గిర దిగ్గియ దాయాద్యాంధ్రశబ్దములకును డకారాదేశము శాబ్దికమతమున ఘటిల్లుచుండ, దడలకు నాదేశవ్యాజమున యతిప్రాసమైత్రి యేలచెల్లరాదు ?

ఇందులకుఁ గొన్నిప్రయోగంబు లున్నను వాని కిటీవలఁ బాఠాంతరములు గల్పింపఁ బడియె.

ఒక్కయుదాహరణము.

మండితసూర్యరశ్మిరుచిమన్మణిహారచయంబులోఁ గట
స్యంది సుగంధ దానజలసంపద నొప్పెడివాని......(సభాపర్వము)

మండింత యనుపాఠ మచ్చునఁ గనఁబడుచున్నది.

(6) ద్విరదగతి రగడ-

హరి యొప్పు నన నొప్పు నవతారలఘువిరతి
శరధినగ, నఁల, భల, సల, త,రలద్విరదగతి (56 ప)

అప్పకవీయము-

శరమొప్పఁ బంచలఘు గణచతుష్టయముచే
విరమంబు రెంటిపై ద్విరదగతిపేరిచే.

పంచలఘుగణము లెనిమిది- నలల,భల,సల,నగ,జల,త,ర,య. ఇందు జల,యగణము లుపయోగపడవు. ఈయంశ మీరెంటిని పోల్చుటచే ననంతుఁడు లక్షణము స్పష్టముగాఁ దెలియఁబఱచినాఁడు గాని యప్పకవి చెప్పలేదు.

(?)లళలకుఁ బ్రాసమైత్రి కలిపినయెడల లడలకును గొందఱమతమునఁ గలదు.

(7) రగడల భిన్నలక్షణములు.

(i) వృషభగమనము.

శ్రీమనోహరు నంబుజోదరుఁ జిత్తజాతగురుం దలంచెదఁ
గామితార్థవిధాయి నిర్జితకాళియాహిని నాశ్రయించెద
వరుసగా భగణములు భానుసమన్విత ద్వితయములు నాలుగు
ననిమిషాధిప లఘుయతి నిడఁగ నలరు వృషభగమనము మేలగు.

భసనలలు- పాఠాంతరము; చతుర్థపాద మనుసరించి యిదియే సమీచీనము తొలుత నొకపూర్వగణము వెనుకగా భ-స-నల గణములలో నొండు, ఇట్లు నలుమాఱులు వ్రాసిన నొక చరణ మగును; యతి 14 లఘువులపై (4 గణములపై) నుండును.

(ii) హరిణగతి-

శ్రీనివాసు భ-జింతునే నని, పూని కుజనుల-పొంతఁబోనని
భానుయుత నల-భసగగంబుల, లోన నిరుదో-లు ననగంబుల
నిరవుగా నిరు-మూఁడు లఘువుల, నెల్లవారును-నొగి గణింపఁగ
విరతులను గా-వింప నిమ్ముల, హరిణగతి చెలు-వగు జగమ్ముల.

పై వృషభగతి యీహరిణగతికి ద్విగుణమని భావింపవలయు. పై విధముగనే గణము లుండును, రెండుభాగములుగాఁ జేసి భిన్నయతులను పాటించుచు నారెండుసగముల మొదటఁ బ్రాసముల నిర్మింపవలయు. తృతీయపాదమునఁ గొంతభంగము గానంబడుచున్నది 'ఇరవుగా నిరుమూఁడులఘువుల' అనుచో యతిభంగమును, 'ఎల్లవారును- నొగి గణింపఁగ' యనుచోటఁ బ్రాసమును యతియు భంగమగును. అంతియ కాక మూఁడవపాదమున నంత్యానుప్రాసము తప్పిపోవుచున్నది. 'మరియుఁ దానిరు-మూఁడులఘువులు, నిరవుగా గణి-యింప నార్యులు' అని సవరింప సరిపడునేమో. రగడలంగూర్చి భీమనపెద్దనలు దలపెట్టలేదు; అనంతుఁడే వీనిని మొదలిడినవాఁడుగా నగపడుచున్నది; అవల నప్పకవి రచించెను, గాని యతనిమతము పూర్తిగా నిందు భిన్నమై యున్నది చూడుఁడు.

వృషభగతి-

ఇరువదియొనిమిది లఘువులు పది-యేనిట విశ్రాంతియుఁ గూర్చిన
నిరవగు వృషగతి పద్మాధిప-యిది విను మాదరమున ముదమున.

హరిణగతి-

సరహరి పదియు-నాలుగు లములు.
కరియతి హరిణ-గతికి నెళవులు.

(8) యతిభంగములు.

(i) జయభద్రరగడ.

శ్రీకి నాడయుం డనఁగఁ - జిత్తజాని గురుఁడనఁగ
శేషశయనుండనఁగఁ - జెలువుగఁ జతుర్భుజుఁడు
నాకౌకసులనేలు - నముచిసూదనుపూజ
నతఁడు దాఁగైకొన్న - నందగోపాత్మజుఁడు.

ఇందు యతులు మూఁడుస్థలములం దుండవలయును, ప్రథమ పాదమున నట్లేయున్నది; గ్రంథమునఁ దృతీయచతుర్థము లట్లే యున్నవి, గాని ద్వితీయపాదమున 'సూదనుపూజ నతఁడు' అను సంధివశమున నేర్పడిన నకారమును హల్లువలె భావించి యతిమైత్రి నొందించుట దోష మగును.

(ii) ఒగిఁ దరువాతి యిండ్లఁ బ్రతులొంద నధోంకములకు సమాధికం
బుగఁ బ్రతిమానుచుం గడమ కాలప్రతుల్ దొరలించి నిల్పఁగాఁ.
ఇందును యతిభంగమున్నది.

చతుర్థాశ్వాసము.

వ్యాకరణవిశేషములు:—

కేతన పెద్దనాదు లాంధ్రమునకు వ్యాకరణము వ్రాయుటం గని మనయనంతుఁడు చతుర్థాశ్వాసమునఁ గొంతవ్యాకృతిఁ రచించెను ఇంతేకాక తక్కుంగలయాశ్వాసములందును సందర్భపడినపుడు వ్యాకరణ కార్యముల వివరించెను.

1 ఆ, 39 ప-ఆయుపేంద్రుని బొడఁగాంచు—అనుపద్యమునఁ ద్రికసంధి.

1 ఆ, 52 ప-పేర్చి పొల్లునకారంబు బిందువగుచు-అను-చోట వర్గయు క్కులు పరంబగునపుడు ద్రుతసంధి.

1 ఆ, 61 ప-62 ప-కళాద్రుతప్రకృతికసంధులు.

1 ఆ, 63 ప-జడంబు ద్వితీయకుఁ బ్రథమ యగుననుసూత్రముకు,

1 ఆ, 64 ప-అకారసంధి, ఉకారసంధి.

1 ఆ, 65 ప-టుగాగమ నుగాగమ సంధులు.

1 ఆ, 66 ప-పదమధ్యములందలిదుఋఌ రువర్ణములస్వరలోపము.

1 ఆ, 85 ప-ఐ, ఔలకు అయి అవు లగుట

1 ఆ, 114 ప-జ్ఞాకుఁ దద్భవమున నకార మగుట.

1 ఆ, 115 ప-ఆంధ్రలిపి ఋకారసంయుతము లేమి.

ఇట్లు వ్యాకరణాంశములు తెలుపఁబడినవి. ఇప్పటిసులభ వ్యాకరణాదు లాంధ్రుల కుపయోగించుటం జేసి సంస్కృతసంధి సమాసప్రకరణములతోఁ జేర్పబడినట్లు ఛందోదర్పణంబునఁ దత్పూర్వగ్రంథంబులందు లేనిసంస్కృతసంధిసమాసాదులు పద్యరూపములుగా రచియింపఁబడ్డవి. ఇదియే తక్కినవానికన్న నిం దున్నవిశిష్ట ప్రకృత మనంతుని వ్యాకరణ ప్రయోగములంగూర్చి కొంత చింతింతము. ఇంతకుమున్నె ప్రథమమైన, ద్వితీయాశ్వాసంబునకు మున్నగునవి చర్చింపబడియె ఇందుఁ జతుర్థాశ్వాసమందలివిషయముమాత్రమే కైకొనంబడును.

19 ప-దీ నోడయుఁడు, ఇ దెట్లోడవె కుసంధులుఁట.

ఇందు మొదటిది వానిల్లు, దానిల్లు ఇత్యాదిం బోలినదిగానఁ బ్రయోగింపవచ్చు; ఇది + ఎట్లోడవె "ప్రాయస్తుస్యాత్క్వమాదికస్యేతః" అని చింతామణి, ఇది కిమాదులలోఁ జేరినదగుటచే సంధి వైకల్పికము గాన నిత్యరూపము నిర్దోష మగును. ఇవి కుసంధులు గా వని ఫలితార్థము. 20 ప-అతఁడున్నతేడ్చు-దుస్సంధి.

అతనిశౌర్యశక్తి కిన్నరుడుగ (భారతము) సురగణంబు క్షోభము నొందె న్నివ్విధమున (౬-హరివంశము) మున్నగు ప్రయోగము లున్నవి. ఇది చూచియే కాంబోలు ననంతుఁడు 'ఇట్టివి దళదోషము లనఁ బట్టగుఁ గృతులందు నివియ భాసురముగఁ జేపట్టుదురు ధీరు లొక్కొకపట్టన డెందమ్ము లలరఁ బల్కనఁ గృష్ణా' యని చెప్పి తప్పించుకొన్నాఁడు.

38 ప-మత్స్యంధులను జెప్పుచు, 'ప్రకృతిసంధి యన్నది యాంధ్రభాషఁ గాదు' అన్నాఁడుగాని బ్రహ్మఋషి, మహాఋషి, సప్తఋషులను ప్రకృతిభావసంధివిష్యము లగురూపము లాంధ్రభాషయందును గలవు.

51 ప-ఆడఁజెందె ఘనోత్తుపల్పాతు వనఁగ.

నాఁగ బింబోష్ఠి నొక్కబింబోష్ఠి యనఁగ.

వృద్ధియతిని యతిప్రకరణమునఁ జెప్పకున్నను నిందుఁ గూర్చి యున్నాఁడు. ఇట్లే కాకుస్వరయతికి నుదాహరణపద్యమున*శిడయతి, వితాళచావదలో దడప్రాస, మొంచు యతిప్రాసప్రకరణములందుఁ జెప్పకున్నను ననంతుఁడు రచించినాఁడని చూడఁబడియె.

62 ప-షష్ఠలంబులు నాఁగ సకలజగద్ధితప్రౌఢిమ నాఁగ కుబ్బుస్థులనఁగ—

ప్రౌఢి శబ్దము క్తిన్నంతమే కాని ఇమనిజంతము కాదని సంస్కృత వైయాకరణులయభిప్రాయము. ఆంధ్రమున శ్రీనాథాదిమహాకవిసార్వ భౌము లనేకులు బాహాటముగా 'ప్రౌఢిమ'ను బ్రయోగించియున్నారు.

90 ప-అనుగ్రహ నిగ్రహములు.

అల్పాచ్తర మిత్యాదిపాణినిసూత్రవిరుతి తెనుఁగునకు లేదని శాసించినాఁ డనంతుఁడు, పూర్వకవుల ప్రయోగములంబట్టి యుక్తిన్యాయ్యమని తేలుచున్నది.

102 ప-ఓలిఁ బురుషసింహా యని యుగ్గడించుచోటఁ దాసింహ ఇనపురు షోయనంగ.

* ఎక్కటియతి యందుఁ బాఠాంతరము కల్పింపఁబడినను మూలములో నుంట చేనిందు గ్రహింపఁబడియె.

లోపోసమ ఆది కేవిసర్గస్య అని చింతామణి చెప్పుచున్నను, నమశ్శబ్ద విసర్గస్య లోపమాత్వ మిష్యతే - యను కారికగలదు. గతానుగతికోలో కోయటంచిత్యాది ప్రయోగములు కారికననుసరించి యేర్పడినవి. అట్టివే పైసింహోయని, పురుషోయనంగ, ననుప్రయోగములు.

103 వ- సంస్కృతము తెనుఁగైనఁ దత్సమపదంబు,
దానఁబుట్టి తెనుంగైనఁ దద్భవంబు,
దేశితెనుఁగు దేశజ, మచ్చ తెనుఁగు తెనుఁగు,
నిర్మలుఁడు, సిరి, యొడయఁడు, నిక్కమనఁగ.

పై పద్యమాంధ్రభాష - తత్సమము, తద్భవము, దేశితెనుఁగు, అచ్చతెనుఁగని చతుర్విధమని తెల్పుచున్నది. కాని 'తజ్జానమాచదేశ్యా గ్రామ్యాచేయం చతుర్విధా భవతి'యని చింతామణి సూత్రము. గ్రామ్యము భాషలో నొకవిధము కాఁజాలదను కొందఱమతమునకుఁ జేరిన దీయనంతుని పద్యము. దేశ్యమాంధ్రదేశ్యము, అన్యదేశ్యమని యిరుదెఱంగులను నిప్పటి యభిప్రాయము న సంతుఁడు పూర్వమే యాంధ్రదేశ్య మచ్చతెనుఁగు, నన్యదేశ్యము దేశితెనుఁగను విభాగమునఁ జెప్పినాఁడు. కేతనపెద్దనలు తత్సమము, తద్భవము, దేశితెనుఁగు, అచ్చతెనుఁగు, గ్రామ్యమని పంచవిధములనిరి. వీరిమతమును గైకొని మన యనంతామాత్యుఁడు గ్రామ్యమును మాత్రము వదలియున్నాఁడు.

105 వ- పంచమియగు దీనఁబట్టుండి యాదుండి ... ... ... వానియొక్క-
కులంబు.

ఇందు దీనఁబట్టి + ఉండి- ఇత్వసంధి శ్రుతికటువు;

వానియొక్కకులంబు- విభక్తుల కుదాహరణముగా నీయఁబడినది షష్ఠీవిభక్తి ప్రత్యయము జేర్చివ్రాసిన ప్రయోగము గ్రంథంబుల మృగ్యము. యొక్క లోపించి సమాసమగును.

111 ప- పరుఁబలుకుఁ బ్రథమపురుష మె
దిరి మధ్యమపురుషపలుకు ధృతి దనుఁ బలుకుల్
ధరనుత్తమపురుషక్రియ
వరుస నలింగకములైన వచనము తెనుఁగుల్.

పురుషత్రయమునకు లింగవివేకము లేనివచనము లుండునని యర్థము. ఉత్తమమధ్యమములకు మూఁడులింగములందును భేదము లేదుగాని ప్రథమపురుషమున- ఏకవచన పుం- వాఁడు చేయుచున్నాఁడు, స్త్రీ- ఆమె- అది చేయుచున్నది, నపుం- అది చేయుచున్నది, అను భేదము లున్నవి గానఁ బైయనంతునివాక్య మవిచారమూలకమే యగును.

116 ప- పృథయను నవ్యయమొక్కఁడు
ప్రథితంబై చెల్లుఁ గృతులఁ బ్రత్యేకముగా
పృథసేయక యెపుడు మనో
రథములు మాకిమ్ము నీ మురద్విషుఁడనఁగన్.

సంస్కృతావ్యయములలో పృథమాత్రమే తెనుఁగునందుఁ బ్రత్యేకముగాఁ బ్రయోగింపవచ్చునని పై పద్యమునకు భావము.

పలుకులు పృథగా నన్నుం బలికితి (శాంతి ౧ ఆ. 136) అను భారతప్రయోగము పై పృథయను నవ్యయమునకు నాధారముగాఁ గలదు.

పృథయను నొక్కదానికే కాక యనేకసంస్కృతావ్యయములకుఁ బూర్వకవిగ్రంథంబులందుఁ బ్రయోగంబులు గానవచ్చెడు.

జూదరియన్నంబు సూనరియన్నంబు బహిర్వెట్టినతనియన్నమును
(భార- శాం- 1 ఆ.)

బంధువు లెఱిఁగిన బహిరయోర్తురు (భాగ- దశ. పూర్వ. 978.)

మామా నాపైఁ గోపము వరామా. (భాగ నవ. 547.)

స్వస్తిజగత్త్రయాభువనశాసనకర్తకు (భాగ- అష్ట- 545)

సద్యంబ్రహ్మహత్యావధ్యము మొదలైన పాపవర్గం బెల్లన్
(భార- స్వర్గ- ౧ ఆ.)

ఒక దివసంబు నానంద కాననమునందు సర్వదా సిద్ధించుగా
(కాశీ- ౭ ఆ.)

ధాత్రీశుల కర్జున సర్వత్ర జయము (జైమిని- ౭ ఆ.)

ఎవ్వారు నీత్రుతి లేరీ భువనత్రయంబున (హరి- ఉత్తర- ౧౦ ఆ.)

కించిత్తు నల్లి గఱచిన (సుమతిశతకము)

ఇట్లు, సదా, సర్వథా, నహి, నాస్తి, అహహ మున్నగు నవ్యయములకు స్వతంత్ర ప్రయోగములు గలవు. అనంతుని వెనుకటికవులు అథవా వినా ప్రభృతులను బ్రయోగించినారు. తనకుమున్నే వృథేత రావ్యయశబ్దములకుఁ గవిప్రయోగము లుండ ననంతుఁ డొకవృథకు మాత్రము సూత్రించుట యుక్తిని పరిశీలనలోప మున్నదని తోఁచెడు.

పంచాశ ద్వర్ణంబులు:—

121 క. భూమిఁ బదాఱచ్చులు నాఁగా మెఱసి అకార మాదిగా స్వరములగుఁగా
కామొదలు ళకారము తుదయై మూఁప్పదినాల్గు హల్లు లగు వ్యంజనముల్.

125 వ. శలలకు భేదము లేదను వలుకున శాఁదొలఁగిమొగు పనులగువర్ణంబులు సంస్కృతభాషకు మఱి తెలుఁగున ఆశలనఁగ రెండధికమంద్రు హరీ.

శబ్దచింతామణి- అద్యాయాః పంచాశద్వర్ణాః.

ఇందులకు వరరుచివచనము:—

ద్విధాక ఏచో నుస్వారో విసర్గ ష్షోడశస్వరాః
స్పర్శా అంతస్థశోష్మాణ శ్చతుస్త్రింశ ద్ధలస్మృతాః.

చింతామణి వరరుచివచనములు ళకారమును విడిచి శకారమును వర్ణనము దాయమునఁ జెప్పుచున్నవి గాని పాణిని మహేశ్వరసూత్రములందు శాలేదు. ఈ యనంతుని పద్యములను ఖండించి యప్పకవి శకారమును బ్రత్యేకవర్ణముగా నిర్ధరించెను. 'ఏకనీశము దేవహేళనంబు నటం

చు యాజుషామ్నాయంబు నందు లేదో, కాళనాళవ్యాళగోళహింతా-
ళంబులనుచు సంస్కృతభాషయందు లేదో, యని రచించి,

'కాకు షా జడ్డమైన ళకారమగుట
దలఁప కేఁబడి లిపులలో దానిఁగూర్చి
తెలుఁగ భిన్నాక్షరంబైన దొడ్డళాను
విడిచిపెట్టె ననంతుండు వెఱ్ఱి గాఁడె.

యని పరిహసించియున్నాఁడు:—

యత్ర విశ్వంభవత్యేకనీళం (యజురారణ్యక నారాయణప్రశ్నము)
యద్దేవా దేవహేళనం (యజురారణ్యక నారాయణప్రశ్నము)

ఇందు ళకారమున్నది గాని కాళనాళవ్యాళగోళహింతాళములు లాంతములుగానే పరిగణింపవచ్చు. సరిగదా, ళకారమును నిషేధించిన యనంతుఁడు మఱల,

128 వ- అమలు వర్గత్రయమును
భూదేవతలు, తవర్గములు రవలును ధా
త్రీదయితులు, యల శషసహ
లాదట నూరుజులు, ళక్షరాఖ్యలు శూద్రుల్.

అనుపద్యమున ళకారమెట్లు గ్రహించినాఁడో తెలియదు. 'తెలుఁగున ఱళ లనఁగ రెండధికమంద్రు హరి' యనియోఁ గానఁ దెలుఁగునందని భావించినచో ఆయేల చెప్పలే దను ప్రశ్న సంభవించును.

ఛందోదర్పణమునందలి కొన్ని పద్యములకర్థము సుబోధముగా లేదు. వ్యాస విస్తరభీతిని వాని నిందుఁ దలపెట్టలేదు.

అనంతుఁడు లక్ష్యాన్వేషకులకంటె విపులముగా ఛందంబును, వారు చెప్పని యాంధ్రోపయుక్తంబగు సంస్కృతవ్యాకరణంబును రచియించి యుత్తరకవ్యాదులకు మార్గదర్శకుండయి యాచంద్రతారార్కస్థాయి యగు కీర్తిఁ బ్రశంసితవ్యుఁడుగా వర్తించుచున్నాఁడు. ఇవ్విమర్శనమందు యతిప్రాసవ్యవస్థ, పిహార్యాగీకృక్షరాది విషయంబులను శ్రీ గిడుగు వేంకటసీతాపతిగారు విస్తారంబు విమర్శించి యుంటం జేసి వానిని

విడనాడి నాకుఁ బొడఁగట్టిన కొన్ని విషయములను మేళగించి రచించి నాఁడను.

ముద్రణస్ఖాలిత్యములు:—

వావిళ్లవారి ప్రతియందనేక స్ఖలనము లేర్పడియుండుటచేత మేటిల దానింజాలమట్టునకుఁ బరిశీలించి తప్పొప్పులపట్టిక నొండు ననుబంధముగాఁ జేర్చితి. మఱి యట్లున్నను ననివార్యములుగాఁ గొన్ని యింకను గలవు.

1 ఆ. 27 ప- అధికశుభం, బాదవును భయములను హానిఁబొందు నృసింహా- ఇందు హానినొందునని మార్చిన యతిభంగము తొలంగును.

1 ఆ 63 ప- 'అయచేత సద్వితీయ దానిజరూపమయ్యెనుంపఁ బ్రథమ యట్టులుండుఁ, గ్రతువుఁగాచె దాశరథి కృష్ణుఁ డాకపర్వతమును గొడుగుభంగిఁ దాల్చెననగ? జడంబు ద్వితీయకుఁ బ్రథమ విభావనగు ననుటేదీపితార్థము. పర్వతమును ద్వితీయకును, క్రతువు ప్రథమకు నుదాహరణములగుటచేఁ గ్రతువుపై నర్థబింగ వ్రంట దోషము.

2 ఆ 48 ప- పెంపారఁ దాజంబులఁ జేర్చు రేఫలో-యతిభంగము; పేర్చు అని సవరించుకొవలయు.

3 ఆ 43 ప- కనకవస్త్రుని గృత్తకైటభునిగొలుతు ఇదియంతరాక్కర- 1 సూ, 2 ఇం, 1 చం; కైటభునిగొల్తు అనియుండవలయు.

3 ఆ 57 ప- రగడ- ఇతనిఁగొల్చినఁగాని......ఎసఁగు నివ్విభుఁడనుమ జతురమతు...............బాటింపులం బెంచు అంతాను ప్రాస విధిచేఁ బైపాదము కడపట 'అంచు' అని యుండనగు.

4 ఆ 48 ప- 'ఇగ్వ ముత్వ మోత్వ మైత్వ మాత్వంబైదు
నాదిమై ఋకారము కరమైనవోట'

మొదటిపాద మాటవెలఁదివలె నున్నదిగాన భ్రమంచి యట్లే ముద్రిం

చినట్లు నో(చుడి(గాని రెండవపాదము తేటగీతియని స్పష్టముగా(దెలుపు చున్నది. ప్రథమపాదము గణభంగమగుటంబట్టి తేటగీతి యగుటకు 'ఇత్వ ముత్వ మోత్వంబైత్వ మాత్వమైను' అని మార్పవలయు.

4 ఆ 76 ప- తే. గీ. వామపదవి సర్గాంతవర్ణమోత్వ
మగు రజోగుణమున మనోహరమనంగ.

4 ఆ 81 ప- క కవియు(బునర్ బుతుసమేత కమలాక్షియనగ-పునర్బు
తు అనుశబ్దమున 'స' గురువుగానేరదు గాన గణభంగము తటస్థించు.
'కవియును బునర్భుతుసమేత' అని సవరింపవలె.

యతిప్రకరణమున 24 యతులపేర్లు నాయావద్యములకు ముందు ముద్రితములుగా లేక యందు 15 మాత్రమేయున్నవి. ఇంతియకాక మఱి కొన్ని యతిగణప్రాసభంగములు ముందే పేర్కొనఁబడియె. వీనినన్నిటిని బునర్ముద్రణమున సంస్కరించి సంధియుంబులు దొలఁగును. వీనినిందు గూర్చుటకు నిదాన మనంతామాత్యునిపై నారోపింపఁజాలవలయు నను టకేయని తెలుపుచున్నాఁడను.

# "అఱవనామెత"

[అర్థవిచారణము.]

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి.

కూకటివేణితోఁ గురులు కూడకమున్న కుచప్రరోహముల్
పోఁకలతోడిసామ్యమును బొందకమున్న నితంబసీమకున్
ప్రేఁకదనం బొకింత ప్రభవింపకమున్న ప్రసూనబాణుఁ డ
ట్టాఁకలఁ బెట్టెఁ దా నఱవనామెతబాలికకై విటావళిన్.

కళాపూర్ణోదయపద్యమునందలి "అఱవనామెత" పదమునకుఁ బండితులు పలువిధము లగు నర్థములు తలకొకరీతిఁ జెప్పిరి. అవి కొన్ని వివరింపఁబడుచున్నవి.

(౧) అరవన్ = ఎడారిలో, ఆమెత = విందువంటిదగు బాలికకై ప్రసూనబాణుఁడు తాను విటావళిని అట్టాఁకలఁ బెట్టెను = నిర్బంధించెను. కలభాషిణి యెడారియందలివిందువలెఁ దృప్తికరముగ నున్నదని భావము. (అరవ శబ్దమున కెడారి యనునర్థ మగపడదు).

(౨) అఱవని—అఱగని, జీర్ణముగాని ఆమెత = విందువంటిది. కలభాషిణి సంపూర్ణమైన విందువంటి దనుట.

(౩) ప్రసూనబాణుఁడు తాన్ అఱవన్ = అఱచుచున్నట్లుగా (విటవిజయముచే) ఆమెతబాలికకై = విందైనపిల్లకై (భోగపుఁగన్నెయగుటచే విందువంటిది) విటావళి నట్టాఁకలఁ బెట్టెను.

(౪) ప్రసూనబాణుఁడు తాను విటావళిని ఆమెతన్ = అనుభవమందు బాలికకై అఱవన్ = ఆటంకపఱుచుటకు కేకలు వేయుచుండఁగా అట్టాఁకలఁబెట్టె = మిక్కిలి ఆఁకలియందుఁ బడవైచెను. (విందు ముందఱఁ బెట్టి విటులను మన్మథుఁ డూరించుచుండె ననుట)

(౫) అరవన్ = రాజవీథిలో ఆమెతబాలికకై = వడ్డించని విందైన యా కలభాషిణికొఱకై, సిద్ధమైనవిందని యుఁ జెప్పుదురు.

(౬) అలువనియామెతబాలిక = సమర్థుడు పూర్తిగా నలముకొనని. చిన్నదైనబాలిక (అట్టాక. అట్టు + ఆక = మెడనొక్కి యాపుట).

(౭) అలువ = అమ్ము. అలవనియామెతబాలిక = అమ్ముకమునకు సిద్ధము చేయని చిందువంటిబాలిక.

(౮) "అట్టాకలఁ బెట్టి తా నలవ నావెలబాలికకై విటావళిన్"
ఆవెలబాలికకై = ఆబోగపుఁబిల్లకై (తక్కినది సమము).

ఇట సన్నివికల్పములు సూచించి యీచిట్టచివరపాఠము బాగుగ నుండునని శ్రీ॥ శ్రీ॥ ఓలేటి వేంకటరామశాస్త్రులవారు (ఆంధ్రి 3 సం. ౨ సంచి) ఒకవ్యాసము వ్రాసిరి. అప్పటి కది యందముగ నున్నదనియే యనుకొంటిని. వారి కాధారముగ చెన్నపురప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములోని కొన్ని తాటాకుఁబ్రతులలో 'ఆమెత' కడ ఆమెళ- ఆవెల యనుపాఠములు కనఁబడినవఁట- కాని పెక్కుఁబ్రతులలో 'ఆమెత' యే యున్నది.

ఈపాఠములు నీయర్థములు పరిశీలించినచో 'నలవ' యను నలఘురేఫయుక్తపాఠమును, 'ఆమెతబాలిక' యను పాఠమును బహుపండితాంగీకృతములగుటయే గాక, బహుముద్రితా ముద్రితగ్రంథస్థములైనవని తేలినది. లఘురేఫముతో 'నరవ' యనుటయు, 'అలువ' అనుటయు నర్థానుగుణములు కావు. అనుపూర్వకముగ వచ్చు 'అలవనామెతబాలిక' కందమైనయర్థము చెప్పకొన్వఁగాని పాఠము మార్చి యేదో యర్థముచెప్పుట నసి గాదు.

అది యటుండ, శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువున "అట్టాక" పదమునకు ఒత్తుకు,బాధ అనునర్థము వ్రాయుచు నీపద్య ముదాహరించిరి. అచటిపాఠ మిటు లున్నది.

"అట్టాకలఁ బెట్టిఁ దా నరవ నామెతబాలికకై విటావళిన్"

ఇందలి 'యరవ'పదము లఘురేఫయుతము. నిఘంటుకారులు అరవశబ్దమునకు ద్రావిడుఁ డని మాత్ర మర్థ మున్నటులు వ్రాసిరి. అది

ప్రకృతమున సరిపడదుగదా? మఱి యచట నర్థ మెట్లో యోదింపవలసి యున్నది. (౧) లోఁ జెప్పినట్లు అరవశబ్దమునకు ఎడారి యనునర్థము చెప్పఁగొందమనిన, నది యాయర్థమున నప్రయుక్తము సరికదా, అభిధానికము కూడఁ గాదు. (౨) లో వ్రాసినట్లు రాజవీథి యనుటకుఁ బై సమాధానమే చెప్పవలసివచ్చును. కాన నిట శకటరేఫపాఠమే గ్రాహ్యము.

ఇది యెల్లఁ జూడ నా కిట్లు తోఁచినది. 'అఱచు' ధాతువునకు కేక వేయు, పిలుచు ననునర్థము ప్రఖ్యాతముగ నున్నది. ప్రయోగములు కూడఁ బెక్కులు. అఱచని + ఆమెత = పిలువని విందు. ఇట్టి సంధులు చేయుట పెక్కుచోటులఁ గలదు. కలభాషిణి పిలువనివిందువంటి దని పిండితార్థము. ఒకరింట విందు చేయుచుఁ బిలువకున్నచో మన మారాట పడుట (ఉవ్విళులూరుట) సహజము. కలభాషిణి పిలువనివిందువలె విటులచిత్తములను అఱ్ఱాఁకలఁ బెట్టినది, అనఁగా బాధలఁ బెట్టినది. (౪) లో సూచించునటులు అఱ్ఱాఁకటఁబెట్టె ననిన మఱియు సరసముగ నుండి ప్రకృతార్థమును సార్థకము చేయును. పిలువనివిందు అఱ్ఱాఁకట = మిక్కిలి ఆఁకలియందుఁ బెట్టు ననుట నిజము. ఈపాఠము లేదం దురేమో? ల, ట లకుఁ బెద్దవ్యత్యాసము లేకుండుటచేఁ దాళపత్త్ర ప్రతులు సరిగఁ జూచిన సంశయ విచ్ఛిత్తి యగును. 'ఆమెత' యనుపాఠ మంగీకరించినపక్షమున నఱ్ఱాఁకటఁబెట్టె ననుటయే యనుగుణము.

బహుసమ్మతమగుపాఠము విడిచి యొకటిరెండుప్రతులలో నున్నదని "ఆవెలశాలిక" యనుపాఠము స్వీకరించుట మంచి దని నాకుఁ దోఁచదు. ఆ యర్థము చెప్పిన సీపద్యమునకుఁ గలబింకము చెడు నని పించుచున్నది. అయినను, నాదిసిద్ధాంత మనను. యదార్థముగూర్చియు వెల్లడికావలయును.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్తు.

# స్వభానునామ సంవత్సర కార్యనివేదిక.

## 1943—44.

### ప్రతిష్ఠాపకులు.

శ్రీ శ్రీ మహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు పిఠాపురంమహారాజావారు, పరిషద్వ్యవస్థాపాధ్యక్షులు.

శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

### ఉద్ధారకులు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు - ఉయ్యూరు జమీందారువారు.

### అధ్యక్షులు.

సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

### కార్యదర్శులు.

కిడాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ. బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు, ఎం. ఏ.

### కార్యనిర్వాహకసభాసభ్యులు.

శ్రీదివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డిసూర్యనారాయణమూర్తినాయుడుగారు(కోశాధ్యక్షులు.)

,, పిల్లారిశెట్టి రంగబ్రహ్మారావునాయుడుగారు.

,, కోకా శివనాథశాస్త్రిగారు.

,, కొమ్మిరెడ్డి కేశవరామమూర్తినాయుడుగారు.

,, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

,, నిడుదవోలు వేంకటరావుగారు, ఎం. ఏ.

,, ప్రతివాదిభయంకరం పార్థసారధిగారు, బి. ఏ., ఎల్. ఎల్. బి.

,, కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ.

,, కేశవరపు కామరాజుగారు

,, వేమల శ్రీరామచంద్రకీర్తిగారు, ఎమ్. ఏ.

,, ఏలేశ్వరపు వెంకటరమణసుబ్బారావుగారు, బి. ఏ., బి. ఎల్.

,, అడ్డాల రామమూర్తిగారు, బి ఎ. బి. ఎల్.

స్వభానుసంవత్సరముతోఁ బరిషత్తునకు ముప్పదిరెండవసంవత్సరము ముగిసినది. యుద్ధపరిస్థితులు తీవ్రముగనుండి పరిషత్కార్యములకు వలయు కాగితము సరిగ లభింపకపోయినను, పత్రికాముద్రణము యథాప్రకారము జరుగుచున్నది. నూతనగ్రంథముల ముద్రించుటకు మాత్రము వీలుకలుగుటలేదు.

పరిషద్భాండాగారము దినదినాభివృద్ధి నొందుచున్నది. నూతనగ్రంథములు చేర్పఁబడుచున్నవి. వినిమయముగఁ బత్రికలఁబంపుపత్రికాధిపతులకును, గ్రంథముల నుచితముగ నొసఁగినవారికిని మన కృతజ్ఞతాభివందనములు. కాశీఖండపు తాళపత్త్రప్రతులఁ బరిశోధించి యందలి పాఠభేదములు వ్రాయింపఁబడుచున్నవి. త్వరలో వానిని బత్రికాముఖమునఁ బ్రచురించి పాఠకలోకమున కందఁజేయఁగలమని యాశించుచున్నాము. ముద్రితాముద్రితగ్రంథముల పట్టికలను వ్రాయించి, కాగితము లభించిన వెంటనే వానిని ముద్రింపవలసియున్నది. కాశీఖండము పాఠభేదములు పూర్తియైన తరువాత నాంధ్రమహాభారతము ప్రతుల పరిశోధించి పాఠభేదములఁ బ్రకటించుచున్నాము.

శ్రీ శ్రీ పిఠాపురప్రభువుల యాదరమువలనను గార్యదీక్షవలనను సూర్యరాయాంధ్రనిఘంటువు నాల్గవసంపుటము ముద్రణము పూర్తియైనది. మిగిలిన సంపుటములవలెనే నాలుగవసంపుటముగూడ ప్రతియొక్కంటికి నాలుగురూపాయలకు విక్రయింపఁబడును. వెనుకటివలె నచ్చుపనిజరుగుటకు సౌకర్యము లేమి నిఘంటుకార్యస్థానమున 'ప' వర్గశబ్దములు పండితులు పరిశోధించి ముద్రణమునకు సిద్ధము చేయుచున్నారు. అచిరకాలముననే అయిదవసంపుటము ముద్రణము ప్రారంభింపఁబడును.

స్వభానుసంవత్సర ఆయవ్యయపట్టిక పరిచూడఁబడి యనుబంధమునఁ జేర్పఁబడినది. శ్రీ శ్రీ బొబ్బిలి, వేంకటగిరిమహారాజావారలిచ్చిన విరాళములవడ్డీవలనను, పుస్తకవిక్రయమువలనను లభించిన ద్రవ్యముతోడను, పరిషత్కార్యముల యథావిధిగ నిర్వహింపఁగలుగుచున్నాము.

శ్రీ శ్రీ బొబ్బిలిమహారాజావారి పత్రములవలన నీసంవత్సరము రు 400-లును వేంకటగిరివారి పత్రములవలన రు 350- లును వచ్చినవి. నిఘంటుసంపుటములయొక్క విక్రయమువలనను పరిషద్గ్రంథ విక్రయము వలనను రు 691-7-0 లు వచ్చినవి.

నూతనభవనమునఁ బరిషత్కార్యాలయమునఁ జేర్చినతరువాత నితోఽధికముగ కార్యనిర్వహణ మొనర్చుటకు బ్రయత్నములు జరుపఁబడునని నివేదించుచున్నాము.

పరిషత్కార్యనిర్వహణమును గూర్చియు, పరిషదుద్దేశములను గూర్చియు నాంధ్రదేశమునఁ బ్రచారము గావించి వలయుధనమును సంపాదింపవలసియున్నది. అందులకుఁ దగినసహాయమును గార్యనిర్వాహకసభ్యులును, పరిషత్సభ్యులును జేయుదు రని యాసించుచున్నాము. పరిషత్కార్యముల సహాయమునొసంగి తమ యభిమానమును నిరంతరముఁ జూపుచున్న కార్యనిర్వాహకసభ్యులకు మావందనములు.

మాకోరికపై శ్రమయనక నాయవ్యయములఁ బరిశీలించి యీ సంవత్సరము లెక్కలను సరిచూచిన శ్రీ పళ్లె వెంకటహనుమంతరావు గారికి మావందనములు.

ఇట్లు విధేయులు,
కిళాంబి రాఘవాచార్యులు,
వింజమూరి వెంకన్న,
కార్యదర్శులు.

---

# ఆంధ్ర సాహిత్య
# స్వభాను నామ సంవత్సర
# ఆదాయవ్యయముల

| నెం. | ఆదాయము. | | | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| 1. | సంవత్సర ప్రారంభనిలవ | | ... | 78 | 7 | 2 |
| 2. | వడ్డీ - బ్యాంకుద్వారా వసూళ్లు | | ... | 750 | 1 | 0 |
| | శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజా వారిచ్చిన గవర్నమెంటుపత్రముల వడ్డీ 1943-44 | రు 400-0-0 | | | | |
| | వెంకటగిరి ,, | 350-0-0 | | | | |
| | బ్యాంకివడ్డీ | 0-1-0 | | | | |
| | | 750-1-0 | | | | |
| 3. | సాధారణసభ్యుల చందాలు | | ... | 18 | 0 | 0 |
| 4. | చందాలు | | ... | 81 | 0 | 0 |
| 5. | విక్రయములు | | ... | 691 | 7 | 0 |
| | i. పరిషత్తుపత్రికల విడిసంచికలు | 3-8-0 | | | | |
| | ii. పుస్తకములు (వెద్యాలు దాఖలా) | 687-15-0 | | | | |
| 6. | చిల్లర జములు | | ... | 0 | 2 | 6 |
| 7. | శ్రీ కొత్తపల్లి సుబ్రహ్మణ్యముగారు | | ... | 4 | 1 | 9 |

1623—3—5

కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రి,
అధ్యక్షులు.

కిళాంబి రాఘవాచార్యులు,
వింజమూరి వెంకన్న,
కార్యదర్శులు.

# పరిషత్తు – కాకినాడ.
## (6-4-43 మొదలు 24-3-44 వఱకు.)
## తఖ్తీలు లెఖ్ఖ.

| నెం. | వ్యయము. | | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|
| 1. | బ్యాంకి చిల్లరవ్యయములు | ... | 1 | 0 | 0 |
| 2. | క్యాటలాగు వ్రాసినపండితునకు | ... | 20 | 0 | 0 |
| 3. | కొత్తపల్లి సుబ్రహ్మణ్యంగారు - (శ్రీ శే॥ కొ. సూ. జీతంబాపతు) | | 20 | 4 | 0 |
| 4. | పోస్టేజి | ... | 36 | 2 | 6 |
| 5. | ప్రయాణవ్యయము | ... | 10 | 4 | 0 |
| 6. | జీతములు | ... | 701 | 15 | 6 |
| 7. | పత్రికకు కాగితము | ... | 63 | 6 | 0 |
| 8. | ప్రింటింగు | ... | 110 | 0 | 0 |
| | బైండింగు : | ... | 195 | 8 | 0 |
| | i. లైబ్రరీ పుస్తకములు 13-4-0 | | | | |
| | ii. లెక్సికన్ 182-4-0 | | | | |
| 9. | పత్రికలకు చందాలు | ... | 48 | 10 | 0 |
| 10. | పుస్తకములు - ఖరీదుచేసినవి | ... | 103 | 5 | 0 |
| 11. | సాదరు | ... | 20 | 10 | 3 |
| 12. | నగదు నిలవ | ... | 292 | 2 | 2 |
| | బ్యాంకిలో 9- 6-7 | | | | |
| | కార్యదర్శివద్ద 282-11-7 | | | | |
| | | | 1623 | 3 | 5 |

6-4-43 మొదలు 24-3-44 ఆఖరుకుఅయ్యే స్వభానునామసంవత్సరపు ఆంధ్ర సాహిత్యపరిషత్తు యొక్క బుక్కులనుబట్టిన్ని, లెఖ్ఖలనుబట్టిన్ని, యీ పై ఆదాయ వ్యయముల తఖ్తీలులెఖ్ఖ నేను తణికీచేసినాను. కావలసిన యావత్తు సంజాయిషీ పుచ్చుకున్నాను. ఈపై ఆదాయవ్యయములెఖ్ఖ నిజమైనట్టిన్ని, సరియైనట్టిన్ని, స్థితిని కనపరచుచున్నదని నేను యిందుమూలముగా తెలియచేయుచున్నాను.

కాకినాడ }
2-6-1944. }

పల్లె వెంకటహనుమంతరావు,
2-6-44.
గవర్నమెంటు డిప్లమాహోల్డరు ఇన్ కామర్సు
ఇన్‌కమ్‌టాక్సు ప్రాక్టీషనరు అండు ఆడిటరు.

# పుస్తకవిక్రయము

| | రు.అ.పై | | రు.అ.పై |
|---|---|---|---|
| విప్రనారాయణచరిత్రము | 2- 5-9 | రాయవాచకము | 2-12-6 |
| జైమినిభారతము | 88- 3-0 | సింహాసనద్వాత్రింశిక 1 భా | 8- 8-0 |
| కవిజనాశ్రయము | 14- 8-3 | డిటో 2 భా | 8- 8-0 |
| యుద్ధమల్లుని బెజవాడశిలాశాసనం | 1-12-8 | నిఘంటుచరిత్రము | 0-11-0 |
| జ్యోతిశ్శాస్త్రసారము | 1- 5-6 | ఆంధ్రకౌముది | 3- 2-6 |
| జ్ఞానప్రసూనాంబికాశతకము | 0- 1-9 | బాలభారతము | 24-10-9 |
| సర్వేశ్వరశతకము | 0- 8-9 | Dravidian Lexicography | 0-7-0 |
| కావ్యాలంకారచూడామణి | 2-15-6 | Defence of Literary Telugu | 0-15-6 |
| అకారాద్యనుక్రమితగ్రంథసూచిక | 0-14-6 | చాటుధారాచమత్కారసారః | 2- 0-3 |
| ప్రాకృతభాషోత్పత్తి | 3-15-8 | సాంబోపాఖ్యానము | 0-14-6 |
| శివతత్త్వసారము | 2-13-9 | రసార్ణవాలంకారము | 1- 2-3 |
| చంద్రభానుచరిత్రము | 3- 2-6 | కవిజనోజ్జీవని సమస్యలు | 0-14-3 |
| శివరాత్రిమాహాత్మ్యము | 13- 3-0 | రఘునాథరామాయణము | 1-12-6 |
| ఆర్యభాషావిభాగము | 3- 1-3 | రజతోత్సవసంపుటము | 3- 2-6 |
| ప్రాస్వరంగములు | 0-15-3 | ఆంధ్రసాహిత్యపరిషద్వృత్తాంతం | 0-14-3 |
| నారసింహపురాణము | 1-12-3 | అరవదేశమునందలిఆంధ్రవాఙ్మయం | 2- 4-6 |
| మన్నారుదాసవిలాసనాటకము | 1- 3-3 | లౌకికన్యాయవివరణము | 1- 6-3 |
| కాళిందీకన్యాపరిణయము 1 భా | 4- 6-6 | లక్షణసారసంగ్రహము | 3-10-0 |
| డిటో 2 భా | 2- 3-0 | కావ్యాలంకారచూడామణి పాఠభేదములు | 0- 9-0 |
| రెడ్డినాటి రెండుశాసనములు | 0- 7-3 | ఉత్తరరామచరితము | 4-12-6 |
| ఆంధ్రధాతుమాల | 2-10-3 | శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు 1 భా | 158- 8-0 |
| శాసనపద్యమంజరి 1 భా | 0-10-6 | 2 భా | 136- 4-0 |
| డిటో 2 భా | 0-14-3 | 3 భా | 185-12-0 |
| శతకసముచ్చయము 1 భా | 5- 1-3 | అమరుకము | 5- 0-9 |
| డిటో 2 భా | 4- 3-9 | చంపూరామాయణము | 2-12-6 |
| పరిషత్పుస్తకభాండాగారము2భా | 1- 3-3 | ఆంధ్రవాఙ్మయవికాసఝరి | 3- 3-6 |
| సూత్రాంధ్రవ్యాకరణము | 3- 0-6 | బాలరామాయణము | 0- 1-9 |
| రసాభరణము | 2-12-3 | సీతారామచరిత్రము | 0- 7-3 |
| ఆంధ్రశబ్దచింతామణి | 4- 4-6 | పరిషత్పుస్తకభాండాగారము3భా | 0-13-3 |
| షోడశకుమారచరిత్రము | 1-14-6 | | |
| హంససందేశము | 0- 4-6 | | |
| | | | 687-15-0 |

## ఆంధ్రసాహిత్యపరిషత్తు - ప్రతిష్ఠాపకులు.

శ్రీ శ్రీ మహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు
పిఠాపురంమహారాజావారు, పరిషద్వ్యవస్థాపకాధ్యక్షులు.
శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.
శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

### ఉద్ధారకులు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు - ఉయ్యూరు జమీందారువారు.

### అధ్యక్షులు.

సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

### కార్యదర్శులు.

కిడాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ. బి. ఎల్.
వింజమూరి వెంకన్నపంతులుగారు, ఎం. ఏ., సహాయకోశాధ్యక్షులు.

### కార్యనిర్వాహకసభాసభ్యులు.

శ్రీ దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుడుగారు (కోశాధ్యక్షులు.)
,, పిల్లారిశెట్టి రంగబ్రహ్మానాయుడుగారు.
,, కోటా శివనాథశాస్త్రిగారు.
,, కొమ్మిరెడ్డి కేశవరామమూర్తినాయుడుగారు, బి. ఏ.
,, అడ్డాల రామమూర్తిగారు, బి. ఏ. బి. ఎల్.
,, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.
,, నిడుదవోలు వేంకటరావుగారు, ఎం. ఏ.
,, ఏలేశ్వరపు వెంకటరమణసుబ్బారావుగారు, బి. ఏ., బి. ఎల్.
,, ప్రతివాదిభయంకరం పార్థసారధిగారు, బి. ఏ., ఎల్. ఎల్. బి.
,, కందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ.
,, కేశవరపు కామరాజుగారు
,, వేదుల శ్రీరామచంద్రకీర్తిగారు, ఎమ్. ఏ.

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు.

## చతుర్థసంపుటము.

శ్రీపీఠాపురము మహారాజావారి ధనసహాయముచే రచియింపఁబడుచున్న పెద్దనిఘంటువులోని రాయల్ సైజు 1000 పుటలుగల ప్రథమసంపుటమును, 955 పుటలుగల రెండవసంపుటమును, 980 పుటలుగల మూఁడవసంపుటమును, 975 పుటలుగల చతుర్థసంపుటమును, ముద్రితములై విక్రయమునకు సిద్ధముగానున్నవి. ఇందు ప్రథమసంపుటమున అకారము మొదలు, ఔకారమువఱకునుగల యచ్చులాదియందుఁగల సంస్కృతాంధ్రశబ్దము లన్నియుఁగలవు. రెండవసంపుటమున 'క' మొదలు 'ఙ' వఱకుఁగల శబ్దములును, తృతీయసంపుటమున 'చ' మొదలు 'తృ' వఱకుఁగల శబ్దములును, చతుర్థసంపుటమున 'తె' మొదలు 'స్ర' వఱకుఁగల శబ్దములును గలవు. ఇదివఱకున్న నిఘంటువు లన్నిటికంటె నిది సర్వవిధముల నుత్తమమయినది. ఈభాగములు శబ్దరత్నాకరములో 631 పుటలలో మాత్రమే యిమిడినవి. ఈనిఘంటువునందు, సంస్కృతశబ్దములు పూర్వనిఘంటువు లన్నిటియందుకంటె మిక్కిలి యధికముగా నీయఁబడినవి. కావున సంస్కృతవిద్యార్థులకుఁ గూడ మిగుల నుపయోగకరముగా నుండును. అచ్చికపదములకుఁగల యర్థభేదములఁ గనఁబఱచి వానికిఁ బ్రమాణవాక్యములు పూర్వగ్రంథములనుండి విపులముగా నియఁబడినవి. లభ్యమైనంతవఱకుఁ దెనుఁగుశబ్దములకు సంస్కృతప్రాకృతద్రావిడాదిభాషలయందుఁ గల సజాతీయపదములు చూపఁబడినవి. కేవలము విడిశబ్దములే గాక సందర్భానుసారముగ సమస్తపదములు (Phrases) ను వానికిఁ గల యర్థములును బ్రయోగములును గూడ నీయఁబడినవి. జనకశబ్దములక్రింద జన్యశబ్దములు చూపఁబడినవి. ఇది విద్యార్థులకు సహకారి. ఈపుస్తకమును రచియించుటకు ముద్రించుటకు విశేషద్రవ్యము పట్టినను ధనవంతులకే గాక జనసామాన్యమునకుఁ గూడ లభ్యముగా నుండవలయునను తలంపుతో నీక్రిందివెలలు నిర్ణయింపఁబడినవి. ప్రథమసంపుటము సాదాప్రతి వెల రు 5 లు, మేలుప్రతి (Art Paper) రు. 7 లు, ద్వితీయసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలుప్రతి 5 లు. తృతీయసంపుటము సాదాప్రతి రు. 4 లు, మేలుప్రతి రు 5 లు. చతుర్థసంపుటము సాదాప్రతి రు. 4 లు, మేలుప్రతికు 5 లు.

---

Printed by N. Achutaramiah at the Cocanada Printing Works, Cocanada, and Published by K. Raghavacharyulu, Secretary, Telugu Academy, Cocanada.